# లోకబాంధవశతకము.





కర్త:

సహజకవి,

కొక్కిలిగడ్డ వరహా నరసింహమూర్తి.

# లోకబాంధవశతకము.



శ్రీకలితగౌర వార్థాం
బైకువలయమందు నెల్ల ♦ నంచితకీర్తి
నాకావ్యమంమనట్లుగ
నీకరుణ జేయుమయ్య ♦ నీరజనాధా




కర్త:
సహజకవి,

కొక్కిలిగడ్డ వరహానరసింహామూర్తి.


సర్వస్వామ్యసంకలితము. వెల 0—2—0

ఓం

"సూర్యఆత్మాజగత స్తస్థుషశ్చ"

# మనవి.



ఆర్యులారా!

లోకబాంధవుఁడగు సూర్యభగవానుఁడు అనంత శక్తి నిధియై సమస్తజీవకోటికి నయాచితంబుగా తన తేజమును ప్రసరింపఁజేసి సంరక్షించుచున్నాఁడు. భానుఁడు పరమేశ్వరుఁడా యను విషయమునుఁగూర్చి తర్కించుట వ్యర్థము. త్రిమూర్త్యాత్మకుండని శాస్త్రములు వక్కాణించుచున్నవి. హిందూ శాస్త్రముల నేమాత్రమును విశ్వసింపని పాశ్చాత్యులు సమేతముఖగ కిరణ ప్రసరణ మారోగ్యదాయకంబనియు, సూర్యుఁడు జీవశక్తిప్రదాతయనియు, నిర్వచించి సూర్య కిరణచికిత్సను కనిపెట్టియున్నారు.

"అకాలమృత్యుహరణమ్ సర్వవ్యాధివినాశనమ్"

"జన్మాంతర సహస్రేషు దారిద్ర్యో నోపజాయతే"

అని సూర్యార్చనా ఫలితముఁగూర్చి యార్యులు పలికిరి. అట్టి తేజోనిధి యగుమిత్రుని నానేర్చినట్లు స్మర్త మిత్రులప్రోత్సాహంబునఁబద్యప్రసూనంబుల నర్చింపఁబూనితిని. విసంధు

లును రేఫఱకార మైత్రియు భానపునర్భక్తియు నఖండయతియు నుద్దేశపూర్వకముగా నొనరించితిని. యింద సంఖ్యాకములగు దోషంబులుండవచ్చు. ఎన్ని దోసగులున్నను—

క॥ చెప్పెడిది భక్తియుతముగ
చెప్పించెడివాడుమిత్రి। శేఖరుడికనా
తప్పులు బుధులు గణింతురె
యొప్పులగతిఁజూచి మెప్పు। లొసగక ధరణిన్॥

ఓం సవితృసూర్యనారాయణాయనమః

ఇట్లు బుధజన విధేయుడు,
సహజకవి.
కొక్కిలిగడ్డ వరహానరసింహ మూర్తి.

అనకాపల్లి,
1—7—36.




# లోకబాంధవశతకము.



శ్రీలలితాగుణాన్వితుల । చే వెలుఁగొందుచుఁ, బూర్వదిక్సతిన్
మేలిక డాసి చాయలను । మెగ్గులు వెట్టుచు, భక్తకోటులన్
పాలనసేయు నాథుఁడు, కృ । పాభరితాత్ముఁడు, బాలసూర్యుఁడు
ద్వేలసుభాళినాకిఁకల । భీషఁగఁ జేయుత; లోకబాంధవా॥

ఉ॥ తమ్ములనేలువాఁడఖిల । దైత్యకులమ్ములనేచువాఁడు, చ
క్రమ్ములఁగాచువాఁడు, ఘన । కాంతులనిచ్చెడువాఁడు, సర్వలో
కమ్ములఁ బ్రోచువాఁడు, శుభ । కాయుఁడు, చీఁకటిఁ గోలువే
జమ్మున మీఱువాఁడు, నను । సాఁకును గావుత; లోకబాంధవా॥

చ॥ ఎవరినొకాఁడ, నిన్నెయిపు । డిట్టులుకొల్చి భజింపఁ బూనితిన్;
దివసపతీ, తమోదమన । తేజనిధాన, సహస్రదీధితీ
రవి, యరుణార్క, కావుము, ని । రాదరమూనకుమయ్య, దేవ, నిన్
భువి ననయంబుఁ గొల్చెదను । పుష్కరదీపక; లోకబాంధవా॥

ఉ॥ మున్నుమయూరుఁడన్ సుకవి । ముఖ్యుఁడు నిన్ను నుతించి నట్టులే
సన్నుతిఁజేసెదన్, దగ బ్ర । సన్నతఁజూచి, భవత్కటాక్షసం
పన్నునిఁజేసి, యార్తి నడ । పందగునయ్య, యశేషప్రేమతో
మన్ననసేయుమయ్య, సుర । మాన్యవిభాకర; లోకబాంధవా॥

చ॥ నినుఁగొలువంగ, నీచరణ । నీరజముల్ సతతంబుఁజిత్తమం
దుననిలుపంగ, భక్తిమతి । తోడభవచ్చరితంబు నెన్నఁగా,
ననయముఁబద్యరత్నముల । నర్చనసేయఁగ, నీదు తేజమున్
గనుఁగొనఁగాంచుభాగ్యమిడి, । కావువికర్తన; లోకబాంధవా॥

ఉ॥ నిన్ను నుతింతునాపదల । నేర్పునఁబాపుమటంచు, నంతెకా
దున్నదికొక్కకోర్కి, దయ । యుంచితవాత్మజులెప్డునాపయిన్
కన్నిడకుండఁజేయుమిది । కాదనఁబోకుము, దిక్కులేమినా
కన్నిఁటనీవుదక్క, భయ । దార్తులఁబాపగ; లోకబాంధవా॥

ఉ॥ రమ్యకృపాకటాక్షమున । రంజనసేయుము, మన్మనోబ్జతా
పమ్మెడలించినాహృదయ । పద్మనివాసివిగమ్ము, నీదుతే
జమ్మునపాపముల్ దునిమి । సత్వరమేభవదీయభక్తిలో
కమ్మునఁదావునాకొసగి, । గాసినిఁబాపుము; లోకబాంధవా॥

ఉ॥ నీకడకంటిచూపుననె । నిక్కముభక్తులకెల్లసౌఖ్యముల్
సేకురు, నీరజావళిని । సేదనుదేర్చెదునట్లె నాదు చీ
కాకెడలించి, సంతతము । ఖండముదంబున నిన్నెకొల్వఁగా
నీకరమూఁతయిమ్ము, నళి । నీహృదయేశ్వర; లోకబాంధవా॥

చ॥ ననుఁబలురీతులన్ రిపుజ । నమ్ములు బాధలఁబెట్టుచుండి రా
ననటభరింపజాల, నిక । వారిమదంబడగింపఁబూని, నీ
ఘనతనునిల్పుకొమ్ము,ననుఁ।గావుమునీపదదాస్యమిచ్చి. యో
యనఘ యికేటిజాలమిది, ।యార్యసమర్చిత;లోకబాంధవా॥

చ॥ మదమును, కామమున్, రుషయు, । మత్సరమున్, ఘన లోభమోహముల్,
గదిసిమహాప్రచండముగఁ । గాసినిబెట్టుచునుండె నన్ను నీ
పదములఁజేర్చి, వానినెడఁ।బాయఁగఁద్రోలుము నీశరాళిచే,
ముదితునిఁజేయుమింకనను । మ్రొక్కెదఁబల్మరు; లోకబాంధవా॥

చ॥ అరసితివామదీయహృద । యాంతరవేదనసుంతయేని నీ
పరమపవిత్రరూపమును । వాసిగఁజూపకపోవు! నేను నీ
విరహమెకారణంబుగను । వేదననందుచునుంటి, నీకృపా
తరణినిఁగష్టసాగరము । దాటఁగఁజేయవె; లోకబాంధవా॥

చ॥ పలుకులువేయునేలనువి । భావస; నీమహనీయదివ్యరో
చులహృదయంబునన్ బరపు।చున్,వృజినంబెడఁబాపి, శేముషీ
కలితునిఁజేయుమయ్య, గుణ । కాండముబెంపగదయ్య, చేతులా
దలపయిమోడ్చిమొక్కెదను, । తామసభంజన; లోకబాంధవా॥

చ॥ తగినగురుండవీవయని । తామదినెంచి ప్రభంజనాత్మజుం
డాగినినుఁజేరి శాస్త్రముల । నోరిమిమైపఠియించె, వేడికిన్
గగనపథంబునన్ నిలుచు । గాసికినోర్చియు, భక్తియుక్తుఁడై,
ఖగ!భవదీయసత్కృపకు। గాదె?తలంపఁగ; లోకబాంధవా॥

ఉ॥ మానితమౌప్రభన్, సవితృ । మండలమధ్యమునన్ కిరీటహా
రానఘరోచులుప్పతిల, । హస్తములందున శంఖచక్రముల్
బూని,సురాళిచేస్తుతులఁ।బొందుచునుండెడునీదురూపమున్
ధ్యానముసేతునెమ్మదిని। తాపమువాయఁగ;లోకబాంధవా॥

ఉ॥ వీత రుజాభరంబు, నరి । వీరవిలుంఠనసాధనంబునౌ,
నీతరుణార్కరూపమును । నేర్పునఁజూపుము, కన్నుదో
యియున్
చేతముసంతసింపగను, । చింతలడంగను, ఘోరకిల్బిష
వ్రాతముచెల్ల, భక్తిమతి । వర్ధిలనాకిక; లోకబాంధవా॥

చ॥ ప్రణవము మంత్రరాజమని । ప్రాజ్ఞులుపల్కిరుఁదెల్పవింటి, నే
మనమునదాల్చిదానినఘ । మర్షణసేయగభక్తితోడ నీ
యనఘసునామబీజముల । నాదటఁగూర్చిజపింతు, నామనో
ప్రణుతులవేగఁగైకొనుము,। భవ్యకృపామతి;లోకబాంధవా॥

ఉ॥ ఎక్కడివాఁడు రాఘవుఁడి । కెక్కడివాఁడు సతీధవుండు?వా
డెక్కడివాఁడుధాత?మఱియెక్కడివాఁడు ప్రభంజనాత్మజుం
డక్కట! వీరిగొల్చిజను । లార్తినిబాయగలేరు, నీవపో
దిక్కని నిన్నువేడెదను, । దీనదయాపర; లోకబాంధవా॥

చ॥ తలపులఁ, జర్యలన్, పలుకు | నట్టుల, భక్తిని నిన్నుఁ గొల్చునా
యలఘులకేలవన్నెలును, | హాటకభూషణరత్నరాజిమిం
చులకు మెఱుంగిడన్ వలెనె? | చూడఁగ నింద్రునివింటిరంగులన్
మలపెడిలోపముబ్బునె? స | మంచితకీర్తిని; లోకబాంధవా॥

ఉ॥ అక్షయభోగభాగ్యముల | సంచితపేర్మినొసంగి, ధాత్రికో
గక్షయకారకుండవయి, | గౌరవమొప్పగ భక్తకోటిసం
రక్షణసేయునీప్రతిభ, | రమ్యగతిన్ నుతియింపలేను, ప్ర
త్యక్షవిభుండవైనఖిల | హర్తవుభర్తవు; లోకబాంధవా॥

చ॥ అరయఁగ ధాతవై జనుల | నాదటసృష్టినిఁ జేతువాపయిన్,
హరివయిలోకసంతతుల | నాదరభావముతోడఁగాతువా
హరుడవునై జగత్త్రయము | నంతముసేతువు, నీవెచూడనా
దరమతిమూడురూపములఁదాల్చెడివాడవు; లోకబాంధవా॥

ఉ॥ వాయువశంబునన్ జెదరు | వారిధరంబులకై వడిన్, భువిన్
నీయసమానతేజమున | నీడలఁ జేరుతమంబురీతిగా,
నాయమితార్తిసంఘములు | నాశనమొందును, నీకునామసా
జ్ఞాయుతభక్తిమంత్రశర | ణంబునుబొందిన; లోకబాంధవా॥

ఉ॥ నీవొకనాడుగన్పడక | నింగినిడాగిన, నెల్లలోకముల్
దేవురుమంచుఁగన్పడును; | తేజముహెచ్చుగనీవుచూపినన్,
చావగసిద్ధమౌనునర | సంఘము; బాపురె! హెచ్చుతగ్గులన్
నీవిసుమంతజూపకయె | యేలుములోకము; లోకబాంధవా॥

చ॥ నిలుపక, సర్వ కాలముల । నేర్పున ఖేచర మార్గగామివై,
యలసటలేక, సర్వజగ । దంతరవస్తుసముంతమాదగా,
కలితమనోజ్ఞతీక్ష్ణతర । కాంతుల, లోకములెల్లఁబెంచి, భ
క్తులహృదయాబ్జసంతతికి । దోహదమిత్తువు; లోకబాంధవా॥

చ॥ పలువిధశాస్త్రముల్ చదువు । పండితనామకులీవుగోళమం
చెలఁగినిఁబల్కుచుందురు; వి । శేషగుణాగ్రులుగల్గువేళనిం
పొలుకుభవత్కరాంచితక । వోష్ణముచేసుఖమౌదనెంతురీ
పలుగులపాడుపల్కులను । పాటియొనర్తువె; లోకబాంధవా॥

ఉ॥ సారథియూరుహీనుఁడు, వి । శాలనభస్థలిపోవుదారి, నీ
తేరునకొక్కచక్రమును, । తీర్చినగుఱ్ఱములేడు, నిత్యమున్
తీరనియానమున్ సలుపు । దీవుజగంబున, నంధకారమున్
బారఁగఁదోలుయత్నమునఁ । బాపురెనీప్రభ; లోకబాంధవా॥

ఉ॥ విగ్రహపూజకూడదని । విజ్ఞులుకొందఱు పల్కఁగా, మనో
నిగ్రహమార్గమద్దియని । నేర్పునకొందఱు పల్కుచుంద్రు;నీ
విగ్రహమెల్లచోటులను । వెల్గుచునుండగ, ధాత్రినింక, వే
ర్వగ్రహరాజియేల? రిపు । వీరభయంకర, లోకబాంధవా॥

చ॥ సకలచరాచరావళికి । సౌఖ్యముఁగూర్చుచు, భక్తకోటులన్
బ్రకటితరీతిఁగాచెదు, భ । వత్కమనీయ కృపారసంబు, నూ
త్నకతనుగ్రోలఁగాఁదలతు । సొంపగుపాయసమట్లు, దానిచే
కకవికలౌచుఁజెల్లునఘ । కాండములెల్లను; లోకబాంధవా॥

ఉ॥ వగ్గకుగామునిన్నిటులు । ప్రార్థనఁజేయుట, నీవురానిచో
నెగ్గగలేను, సౌఖ్యముల । నేగనలేనిఁక, నీదునామమే
యుగ్గునఁబాలుబాల్యమున । నుంచియునాకిల, నన్ను గావనీ
డగ్గఱఁ జేరినాఁడనిఁక । దక్కులుమానుమి; లోకబాంధవా॥

చ॥ పదియునురెండురూపములు । ప్రాభవలీలవెలుంగఁ, బద్మినీ
సుదతినిమేలుకొల్పగను, । సొంపుగఛాయనుచెంతఁజేర్పఁగా
ముదమునవెల్లనిర్జరుల । మొక్కులగైకొనఁ, బూషరూపివై
యుదయధరాధరాగ్రిమున।నొప్పగనుండువు;లోకబాంధవా

ఉ॥ ఈవుసమస్తభక్తహృద । యేశుఁడవంచును, మానివర్యసం
భావితమూర్తివంచును, దివాకరరూపుఁడవంచు,దీనులన్
బ్రోవఁగదీక్షఁగొంటివని, । పుణ్యవివర్ధన! యేనెఱింగి, నీ
సేవలఁజేయుచుంటిఁ,గృపఁజిల్కుమునాపయి;లోకబాంధవా

చ॥ సదయతనెల్లజీవులను । సాఁకఁగఁ, జీఁకటిఁబాఱఁద్రోలఁగాఁ,
బదనుగదుష్టులన్దునిమి ! భక్తులరక్షణఁజేసినీదయా
హృదయమునందు తావొసగ । నెప్పుడుఁ గోరు భవత్స్వ
రూపమా
యుదయగిరిన్ వెలుంగఁగని, । యొప్పుగగొల్చెద; లోక
బాంధవా॥

ఉ॥ రాజులువాజులైరి, కవి । రాజులుమూలలఁజేరినారు, వి
భ్రాజితసద్యశోకలిత । పండితరాజులుశోభఁబాసిరీ
రోజులఁ, బీదలెల్లెడలఁ । రోదనమూర్తినిజేయుచుండగా
యోజనెఱింగి, నీదుపద । యుగ్మముఁజేరితి; లోకబాంధవా॥

ఉ॥ లోకములెల్లధూర్తులకు । లోఁబడెఁ, బాషితపాళికే మొదన్
భీకరదూషణావళిల । భించుటెకాని మఱొండులేను, వి
ద్యాకమలాక్షిశోభఁజెడె! యార్తినిగుందుచునుండ, నియ్యెడన్
నీ కమనీయపాదములె । నిక్కఁపుదిక్కు; లోకబాంధవా॥

ఉ॥ చేరినినున్ భజించినుతి । చేయుచువేఁడెద, సత్కృపామతిన్
ధారుణినాకుఁదొడికిని, । దాల్పఁగబట్టకులోటుసేయు కే
ఘోరరుజాగణంబెపషి, । గోరఘువాపుము, వెన్కనీదరిన్
జేరుచుకొమ్ము, నాకదియ । క్షేమకరంబగు; లోకబాంధవా॥

ఉ॥ నీకిసుమంతకష్టమును । నేగలిగింపఁగలేను, సత్కృపా
స్తోకగభక్తివాహినులఁ । దోలుముపాపములంచుఁగోరితిన్,
ప్రాకటపాపనాశకుఁడ । వై వెలుగొందెడునీకుఁజూపఁ, నా
తేకునకోర్కెకష్టమొకొ । తీర్పఁగనెంచిన; లోకబాంధవా॥

ఉ॥ ఊరకయేదియుఁగానలవ । నోబుధవందిత, మూల్యమిచ్చెదన్,
కోరికఁదీర్తువేసి నిను । గొబ్బున నాహృదయాబ్జసీమలోఁ
జేరఁగనిచ్చి, భక్తిసుధ । చేరలఁగ్రోలఁగనిచ్చి, నిత్యమున్
నేరుపుమించనీపరినె । నిల్చిభజింతును; లోకబాంధవా॥

ఉ॥ ఎందఱనాశ్రయించిన, ని । కొందఱపాదములంటికొల్చి, యిం
కెందఱవెంటబోయినను, । నీధరజీవనమేనిసాగదే
గందరగోళమాచుఁగన ! గానగుచుంటను, నేనురోసి, హృ
న్మందిరమందు నిన్నిలిపి । మన్ననఁగొందును; లోకబాంధవా॥

ఉ॥ ఆర్యులు, సర్వకాలముల । నూహన సిద్ధులునంగ నేర్పరల్,
ధైర్యము,భక్తి,సాహసము । దర్పము,శీలముఁ,గాంచికల్యదో
ర్వీర్యతనుండవచ్చునని । వేమఱుఁదెల్పఁగ, నిన్నుభక్తిపా
చుర్యమెలర్పఁజేరితిని, । శోకమడంపుము; లోకబాంధవా॥

ఉ॥ మాలని కేని, విప్రకుల । మాన్యున కేనియు,మాని కేనియున్,
కాలము సెల్లిపోయినను । కాయము నిల్వదుగాన, వైళమే
యోలిసమస్తయత్నముల । నోరిమితోనొనరించి, భక్తిసం
శీలతనీకృపన్ బడయుఁ । జెల్లునుధారుణిశి; లోకబాంధవా॥

ఉ॥ వేలుపథంబునేనెఱుఁగ, । నెంగలినై పరదైవతంబులన్
జేరినుతింపఁజాల, నిను । చిత్తమునందునబత్తిఁగొల్తు, న
వ్వారిగ సత్కృపన్ గనుము, । పాలనుముంచిననీటముంచినన్
భారమునీదెసుమ్మనుచుఁ । బాలనసేయుఁగ; లోకబాంధవా॥

చ॥ దురితవిదార! నీచరణ । తోయజముల్ మదిలోననిల్పి, నే
పరమపవిత్రభక్తిఁగొలు । వంగనునాకిలలోపమున్న నే
యరుదాగదా? త్వదీయచర । ణాశ్రితకోటినిత్యతృప్తిసేయునీ
కరతతి,మామకాఘమును । ఖండనసేయదె?లోకబాంధవా॥

ఉ॥ పాపములెన్నిచేసితినో । భక్తి నెఱుంగక? మూఢబుద్ధినై
పాపలనెందఱన్ కలుష । వాక్కులదూరితినో? దురంతపుం
గోపముఁజెందకయ్య, యికఁ । గూడనిచేష్టలుచేయనయ్య, నీ
ప్రాపుఁజేరినాఁడ, భవ । భంజనసేయుము;లోకబాంధవా॥

ఉ॥ వచ్చితినీకుసన్నిధిక । వారితభక్తిని, నీదుతేజమున్
మెచ్చితిఁ, జంపకోత్పలసు । మేంద్రసరంబును పాదపూజకై
యిచ్చితి, నాదుకోర్కెఁగడు । నేర్పునఁదీర్పుము, లేకయున్నచో
నచ్చులమెల్లదీరనిను । నారడిఁబెట్టెద; లోకబాంధవా॥

ఉ॥ ఎన్నివిధంబులన్బిలువ । నేమియుఁబల్కవు, కోర్కెఁదీర్చనా
విన్నపమాలకింపవు, వి । వేకమువాసితో? కూర్మివీడితో?
మన్ననసేయుశక్తియది । మంటనుఁగూలెనో? లేకయున్న,నో
యన్న, యిదేటికిట్లుపలు । కాడవు? గావవు? లోకబాంధవా॥

ఉ॥ ఆగ్రహమబ్బెనేని, నిను । నంబరవీధినిఁజాలఁద్రిప్పుచున్,
నీగ్రపచారదోషమును । నేర్పననెల్లరెఱుంగఁజేతునో
యాగ్రహరాజ! చిత్తమున । నింకనెఱుంగుము! తాళనేనునీ,
విగ్రహపుష్టికిన్జడియు । భీరుడగానుర; లోకబాంధవా॥

ఉ॥ అక్కట, యేమిపాపమిది? । యార్తిని నేబిలువంగనీవు నా
దిక్కునకేనిగన్గొనవు । తేకువనిన్ననయంబుఁగొల్చుచున్,
బొక్కిననేమిలాభమిక? । పోయినుతింతుమఱొక్కవేల్పు, నీ
యుక్కుసెడంగఁదిట్టి, కవ । నోద్దతిఁజూపెద; లోకబాంధవా॥

ఉ॥ మున్నొకమానిసత్తముఁడు । మూర్ఖుఁడవీవనియెంచితిట్టడే
నిన్నుసహస్రశేఫునిగ? । నేనునదేగతిమేఘురాజిచే
చెన్నడరన్, సరీసృపము । చేవెతనొందగ, నిన్నుఁదిట్టెదన్
మన్ననసేయ, నింకనిను । మానసమందున; లోకబాంధవా॥

చ॥ అరయగదక్షుయజ్ఞమున । కాదలనీవలుగంగఁ, గోపియై
హరతనయుండుదగ్రతను । హస్తముచేతను పండ్లురాలగాఁ
జరువడెనిన్ను? నీకదియె । చాలదె? సిగ్గరిదేవకోటిలోఁ
తిరిగెదవీవు, నవ్వగును! । తిమ్మసెషున్నది; లోకబాంధవా॥

చ॥ ఒకకపిబాలకుండునిను । నోపికతోఁ గ్రసియింపనెంచి, తాఁ
బ్రకటితరీతిఁబై కెగుర, । వజ్రముతోడనువానిగొట్టి, నీ
తికమకవాపివజ్రి, కడు । తెంపున, లేనిచో నాడెనిన్ను వా
డొకగుటకన్ దినన్ దలచి । యుండెను, నమ్ముము;లోక
బాంధవా॥

చ॥ కలువలనేచి, పద్మతతిఁ । గాచి, సురావళికాగ్నిఁ జూచి, పే
రలుకఁదమంబు నాగ్రించి,రుచి । రంబగుకాంతినిబెంచి,భూమిదే
వులదయఁగాంచు,భేదగుణ। పూర్ణుడవార్యులునిన్ను నవ్విధిన్
గొలిచితరించిరోయెఱుఁగ। కుంటినిసూతయు;లోకబాంధవా॥

ఉ॥ కావుమనన్నుఁగీర్తియె । కావలెనన్నను, కీర్తిమాసియే
పోవలెనన్న నవ్విడిచి । పొమ్మునభస్థలినుండ; నిన్నుసం
భావనసేయునేల? నిక । వైరమెపూనెదనుష్ణగశ్మివో
నీవలనన్ సుఖంబుఁగన । నేరనునేనిక; లోకబాంధవా॥

చ॥ జగములనెల్లనేచునిను। సౌఖ్యమొసంగుమటంచుఁగోరుటల్
తగనొకయక్షువృక్షమును । దగ్గఱిచూతఫలంబుగోరునా
తెగువవిధంబుగన్పడును । తెల్లముగాగమనింప, నింకనా
వగనెషఁబాయఁజేయుదువె। భవ్యమతిన్ గన;లోకబాంధవా॥

చ॥ భళి! భళి! యేమనంటివి? సె। బాసుననున్ గరుణింతునంటివా
వలనుగ నామదిన్ గలుగు । వాంఛలఁదీర్చెదనంటివా? మదీ
యలఘుకవిత్వసారమున । కాదట మెచ్చితినంటివా? ప్రభూ
తలభవదంఘ్రియుగ్మమును । దాకఁగ మ్రొక్కెద; లోక
బాంధవా॥

ఉ॥ సూతయుపాంశితీమహిత । శోభనుగల్గనినాకు కైతనీ
కింతరుచించుసంచెరుఁగ । నేరకపోతిని; భక్తపోష! నీ
యంతమహానుభావునక । హా! కవితారచనాచమత్కృతుల్
గంతులు నేల? భక్తి గద । కావలెనీకిల; లోకబాంధవా॥

ఉ॥ బాపురె! తండ్రి, నాదరికి । వచ్చితివే, ననుధన్యుఁజేయగా?
నేపగునాసనంబిదిదె । యింకుపవిష్టుడవై సుఖంబుగా,
నీపదకంజముల్ గడుగ । నిమ్ము, భవచ్చరణోదకంబుచే
పాపనివృత్తిగాంచెదను । భక్తినిబెంచెద; లోకబాంధవా॥

చ॥ హారి! హారి!! యేమనంటిని? అ । హస్కరనిన్మదిదూరి
యుంటినా?
పరుషములాడియుంటినో కొ, । పాపినినన్ దయఁజూడు
మయ్యనా.
దురితము సైపుమయ్య, మదిఁ । హాత్రిడుబాధలకోర్వఁజాలకన్
మరపున నే నొపల్కితిని,। మన్ననసేయుము; లోకబాంధవా॥

చ॥ విమలరవీజొహారు, ముర । భేదననేత్ర జొహారు, దుస్తమో
దమనజొహారు, తేజసము । దంచితరూపజొహారు, భాస్కరా
కమలపతీజొహారు, రిపు । కంజమదేభజొహారు, శర్వరీ
ప్రమదహరాజొహార్విపుల। వైభవసంయుత;లోకబాంధవా॥

ఉ॥ వందనమో త్రయీతనుఁడ, । వందనమో సురలోకవందితా
వందనమో తమిస్రహరుఁడ, । వందనమో హుతాగ్నినీరదా,
వందనమో విభాకరుఁడ, । వందనమో మునిలోకపూజితా
వందనమో వికర్తన, ది । వాకర, రక్షక; లోకబాంధవ ॥

చ॥ ఘనమె సమస్తలోకముల । ధన్యతఁగూర్చునటంచు నెంతురీ
వినయవిహీనమూఢనర । విక్లబులీయ్యాదిపుట్టునప్పుడే
కొనితమ వెంటఁదెచ్చిరొకొ। కొంచును పోదురొ చచ్చువేళ తా
రెనికకుమించుజన్మముల । నెత్తికిపట్టులు; లోకబాంధవా॥

ఉ॥ వచ్చెడునప్పుడీధరనె । పాడును భాగ్యముఁగొంచురాదు, తాఁ
జచ్చెడివేళ వెంటఁగొనఁ । జాలఁడిఁక నీ నడుమధ్య వేళ నే
పొచ్చెము, గోటు, వేషమును । పొంకముఁ బూనును మూఢ
చిత్తుఁడై
యచ్చెరువౌను దీనిగని । నంతనె నెమ్మది; లోకబాంధవా॥

ఉ॥ ఆలును, బంధువుల్, సుతులు, । నాప్తులు, మిత్రులు, నెల్ల
వారలున్
లీలలు, ధాత్రిమానవుని । లిప్తునిగా నొనరింప; మూఢుఁడీ
వాలకముల్ గణించి, బుధ । వర్యులబోధల లెక్క సేయకే
కాలముఁ జెంది, బాధపడుఁ । గాలునిసన్నిధి; లోకబాంధవా॥

ఉ॥ కాయము రక్తమాంసక్రిమి। కల్మషయుక్తము, నస్థిచర్మముల్
హేయము, దుఃఖభాజనము । హీనరుజాకులమం చెరుంగ కా
మేయగతిన్ బ్రపంచమున। మించి చరించును మూఢుఁడయ్యయో
చేయఁడు నీదు సేవ, మన । సేనియు నిల్పఁడు; లోకబాంధవా॥

చ॥ సిరిగలయంత, మిత్రతతి । చేకును, మెచ్చెదరెల్లబంధుగుల్,
కరమనురక్తిఁజూచువెల । కాంతయు, లోకులుదుర్గుణంబులే
వరసుగుణంబులంచుముఖ । వర్ణనఁజేతురివెల్లనిక్కమా
సిరిచెలియాటలంచనఁగఁ । జెల్లదె, తెల్పుము; లోకబాంధవా॥

చ॥ బ్రదికినయన్నినాళ్లు, సతి, । బాలురు, మిత్రులు, నాప్తబంధువుల్
గదిసిమహాప్రియంబునను । గౌరవమిత్తురు, వెంటనత్తురా
పదఁబడిప్రాణవాయువులు । వాసినపిమ్మట నెవ్వరేనియుఁ
బెదురకపోరు, సత్యమిది । పేర్మినెఱింగితి; లోకబాంధవా॥

చ॥ పదవిలభించినంతగరు । వంబునమూర్ఖుఁడువిఱ్ఱవీఁగు, తా
నదయుతబీదసాదలన । నాదరభావముతోడఁజూచు, నా
పదవియడంగమూషికము । భాతినియూరకుపేరులేక నే
యొదుగును, సిగ్గునందు, కడు । నొంజిలిఁజెందును; లోక
బాంధవా॥

ఉ॥ గొప్పలుసెప్పుకొంచు, బుధ । కోటినిహేళనఁజేసికొంచు, వే
తప్పులఁజేయుచున్, సుజను । ధర్మమెఱుఁగకనిందఁజేయు,నీ
త్రిప్పుడుమానవాధముల । దెన్నడునిన్ దెలియంగనేర్తురో
యప్పయెరుంగఁజాల,నిసు । మంతయునేనిల; లోకబాంధవా॥

చ॥ ధనమదిగల్గువేళనినుఁ । దల్పడుమూర్ఖుఁడుమత్తచిత్తుఁడై
వెనుక, ధనంబుసెల్లినను । వెంగలియై, తనపొట్టకూటికై
సనుటనునిన్ దలంపనిము । సంబునునిల్వఁగలేదు రెండిఁటన్,
గనుఁగొనభ్రష్టతన్ గనును । గాదెతలంపఁగ; లోకబాంధవా॥

ఉ॥ చేతను పాముఁ బట్టినను । చేలమునందు ననగ్నిఁ గట్టినన్,
భూతముతోడ నాడినను । ప్రోడిమి నాపద లేదుకాని, తా
జ్ఞాతులఁ జెంతఁ జేర్చుకొని । సంతసనె, వారలు ఘోరహానులన్
సేతురు, పాలివాండ్రిదదిఁ । జేర్పఁగ రాదుర; లోకబాంధవా॥

ఉ॥ ఎన్నియొ శోధనల్ సలిపి, । యెన్నొ విధంబుల వస్తురాజియు
త్పన్నము సేయు పండితులు, । దైవము లేడని పల్కుచుందురా
పన్నత ప్రాణవాయువులు । బాయు విధం బెఱుఁగంగ లేరు, నీ
సన్నిధిఁ జేర లేరు, నిజ । సత్వ మెఱుంగరు; లోకబాంధవా॥

చ॥ ఎవనికి వాఁడె సర్వజగ । మేలఁగ నెంచుచునున్న వాఁడు, నే
డవనితలంబు సర్వ మొక । యాహవరంగము రీతిఁ దోఁచు, మా
నవులు పశుత్వమూని జన । నాశముఁ గోరుచునున్న వారు, నీ
ప్రవిమలమైన దీధితుల । ప్రోధి నెఱుంగరు; లోకబాంధవా॥

ఉ॥ వాసము నష్టమైన, బుధ । వర్యులు హీనుఁ డటంచు దూరినన్,
గాసివిశేష మబ్బినను, కాలము చెంతకుఁ జేర వచ్చినన్,
మోసముఁ జేసి యేని ధన । ముల్ సమకూర్పఁగ మానవుండు, పే
రాసను వీడ లేక యదు । రంతశ్రమల్ బడు; లోకబాంధవా॥

చ॥ ఘనతర పాపమగ్నమయి । కాయము సర్వము దుర్గదాభరం
బునఁ గడుఁ డస్సియున్నయెడ । మూర్ఖత వెజ్జులఁ జేరి, యోషధీ
గణమును మెక్కి, నీచరణ । కంజముఁ జేరఁడు మానవుండు, నీ
యను పమ సత్కృపన్ బడయ । నర్హుఁడుఁ గాఁడిల; లోక
బాంధవా॥

చ॥ చదువఁగవచ్చుమానవుఁడు । శాస్త్రచయంబునుసూక్ష్మబుద్ధియై,
పదనుగనీతివాక్యములఁ । బల్మరుపాఠముఁజేయవచ్చు, జ
న్మిదమునుద్రెంచిశాఠ్యముల । నేర్పుగఁజుట్టగవచ్చుఁగానితా
నెదనిసుమంతభక్తియును । నిల్పఁగనేరఁడు; లోకబాంధవా॥

చ॥ ఎలమినిదుర్జనుల్కుజను । లెంచుగలారొయటన్ వడిఁజనన్
దలఁతురెకానిసజ్జనుల । తావునఁజేరరదెట్లొటన్న, నీ
గలుచెడువాసనల్మిగులఁ । గల్గునెడఁ జనుఁగాని, కస్తురీ
మిళితసువాసనల్గలుగు । మేల్తలమంటునె; లోకబాంధవా॥

చ॥ పరుసముగల్గుకొద్ది వరి । వంచుశిరంబు, రసాధికత్వతఁ
మెఱుఁగొకయింతకల్గతల । మింటికినెత్తునుగంటెచేనిదే,
యరయఁగనుత్తమాధములు। యౌచితిభాగ్యముగల్గువేళ, నీ
పరమరహస్యముఁ జనులు। పాటిమొనర్తురు; లోకబాంధవా॥

చ॥ ధనమదియెంతగల్గిన, వ । దాన్యతతక్కువయైనమెత్తురే
వినుతగుణౌఘయుక్తులిల? । వేయునికేటికి, మంచివంటకం
బునకొకయింతయుప్పిడక । పోయిననాలుకమెచ్చనేర్చునే?
యానఘచరిత్రసర్వవిబు । ధార్చిత, రక్షకలోక; బాంధవా॥

చ॥ సిరిగల వారికే జనులు । చేర్తురు చేఁగల యర్థమెల్ల, కా
తరమునసరిక్తహస్తముల । దారుమరిట్లనె పంకమెల్ల నా
దరమునపెద్దతిప్పలకుఁ । దారిచి, దీవులుగాఁగఁబెంచి, తా
మరుగును చీలి, వాహినులు । మాతన మాడుచు, లోక
బాంధవా॥

చ॥ చదువును, భాగ్యమున్, పదవి। చాలఁగఁగల్గిననేల, వర్తనం
బదిచెడుఁగైననార్యశము। నందఁడెమాన్యుఁడీజగంబునన్?
సదటునపెద్దబిందెఁగల। పాలనొకించుక యుప్పువైచినన్
గనురుజనింపఁగావిరుగు। కైవడిఁజూడఁగ; లోకబాంధవా॥

చ॥ ఎంతధనాఢ్యుఁడైన, మరి। యెంతటిసుందరకాయుఁడైన, ని
కెంతటివిద్యఁగల్గినను,। నేర్పుననుష్టుని దూరమును నే
యుంతురమూల్యమౌమణిస। మున్నతిశీర్షమునంగఁ దాల్చినన్
జెంతకుదందశూకమును। చేరగనిత్తురె; లోకబాంధవా॥

చ॥ తనకును మేలుఁజేసికడు। దర్పమొసంగినకాష్ఠజాతినే
గొనకొనివేగతాను తెగఁ। గొట్టును గొడ్డలియట్లనేభువిన్
చెనటులు మేలుఁజేయుబుధ। శేఖరపాళికె కీడొనర్తురీ
దనుజులనీవదెట్లుగను। దండనసేతువో; లోకబాంధవా॥

చ॥ అనుపమమైనమౌక్తికము। లాకిటిముందఱఁగుప్పఁబోసినన్
వినుతసునీతివాక్యముల। వేటిఁడి చెంగటబోధఁజేసినన్
గనుగొననొక్కరీతిగనె। గౌరవమందును, మూఢసూకరం
బెనయుసునీతిమౌక్తికము। లేగతి మెచ్చును; లోకబాంధవా॥

చ॥ కులమును, విద్యయున్, ధనముఁ। గూడినచోటనె సద్గుణాళియున్
వెలసినచోసుధీవరులు। వేయువిధంబుల సన్నుతింపరే?
యలఘుమణీమయంబయిన। హాటకమీభువినిష్టగంధమై
విలసిలెనేని, సజ్జనులు। పేర్మినిజూడరె; లోకబాంధవా॥

చ॥ కులమదిలెక్కసేయగను । కూడదుసద్గుణయుక్తుపట్లు, కే
వలగుణశోభమెచ్చవలె । వజ్రముమ్యాల్యమురత్నరాజు, బ్లా
గ్గులగనినుద్భవించెనని । కోవిదముఖ్యులుదానిరోతురే
తలధరియించిమెచ్చుచుము ।దంబునుఁజెందక;లోకబాంధవా

చ॥ పడనుగసజ్జనుండుతన । పట్టునువీడకహాని యేరికిఁ
బడఁపడిసేయకుండినను । పాపమనస్కుడువానినేచు, నా
పడఁబడిపెద్దదూలమొక । పట్టుననుండఁగఁదానిఁజీల్పదే
చెద, యిదియంతయుఁగనఁగఁ । జిత్రముకాదొకో; లోక
బాంధవా॥

ఉ॥ ఎంతటిచెల్మిఁజేసినను । నేని దురాత్మునకంటఁబోదు సు
స్వాంతునిసద్గుణప్రభర । వంతయునేని, సుగంధభూజమూ
లాంతరవాసియాఘణికి । నంటునెతన్మహనీయవాసనల్
సుంతయునేని,పూర్వపువి॥ షోద్ధతివాయునె;లోకబాంధవా॥

ఉ॥ ధీరులుకార్యసాధనకుఁ । దీరనియడ్డములెన్నివచ్చినన్
నేరుపుతోజయంబుఁగొన । నేర్తురు, రావణదైత్యరాజుతో
వైరమునూని, లంకనల । వానరసైన్యముతోజయింపడే
శ్రీరఘురామమూర్తినిజ । చింత నసింపఁగ; లోకబాంధవా॥

చ॥ విలువయొకింతలేనిగుణ । భీరుసిదాంభికవాక్చయంబులన్
గలుఁగదుధైర్యవంతునకు । కాంశ్యముమోగెడునట్టిరీతిగా
పలుకునెమేలివన్నెఁగల । పైడియొకింతయు, నంతమాత్రచే
వెలయుసుమంతతగ్గునె, భు । విన్ బరికింపఁగ;లోకబాంధవా॥

చ॥ ధనమును భూషణంబులును । దగ్రమణీమయతారహారముల్
వినుతసుగంధవస్తువులు । పెక్కుధరించిననేని మూర్ఖుఁడా
జనుఁడిలఁబండితుండగునె? । జానుగ నెంతయలంకరించియుం
చినఖరమేని యశ్వమనఁ । జెల్లునెకేవిని? లోకబాంధవా॥

చ॥ నినుమదిలోన నిల్పగల । నేర్పది శౌర్యము, నిగ్రభావమున్
గనుఁగొనశక్తియున్న, తవ । కాంతినిఁజూడబలంబు లేదు, చం
ద్రునితనచెంతఁజేరుమను । తుంటరిబాలునియుక్తిరీతిగా
నెనయుచునుండె నాకుమతి । హీనతఁజూడఁగ; లోకబాంధవా॥

చ॥ తెలివియొకింతలేనియొక । తెంపరిమూర్ఖుఁడు పండితోత్తముం
బలెతనవేషమూనినను । భాషణమూహనసై జలక్షణం
బులు బయటన్ బడున్, ఖరము । పూనికయత్నము నెంతఁ
జేసినన్
పులినలెనుండ గాఁగలుగు । పోఁడిమిఁగాంచునె; లోకబాంధవా॥

చ॥ వినయవివేకశాలియగు । విజ్ఞుఁడొకండిలఁబేదయైనన్
తనసుగుణాళికిన్ దగును । దారతగౌరవమంద నేర్చు, ధా
రుణినొకజీర్ణవస్త్రమున । రోతనొసంగ బిగించియుంచినన్
మణియుసమానతేజమున। మన్ననఁగాంచదె; లోకబాంధవా॥

చ॥ ధనమును, విద్యయున్, బలము, । దర్పము తేజము, నెంతఁగల్గినన్
మనుజుఁడు తోడివారొసఁగు । మన్ననసాయము లేకనిల్వలే
డెనయుపసిండిపళ్లెమున । కేనియొకించుక గోడచేర్పటం
చనుపలుకిట్టిపట్టులనె । యార్యులు పల్కిరి; లోకబాంధవా॥

చ॥ వరసుకవిత్వసద్రుచులఁ । బామరుడే మెరుగంగనేర్చు? సూ
కరమది యే మెఱుంగుసుర । కాంచనసూనసుగంధకస్తురీ
భరితసువాసనల్, చెడుగు । పంకము మెచ్చునుకాని, యట్టులే
విరసులుపామరాళిసుక । విత్వముపట్లను; లోకబాంధవా॥

ఉ॥ చీమపరోపకారగుణ । సింధువు, నిత్యపరిశ్రమంబుచే
సోమరిగాక, దేహబల । శోభ వెలుంగ, నిజార్జనంబొగిన్
సేమముఁగోరి, తాపొదుపుఁ జేయును, దీనినిఁజూచిమానవుం
డీమహిసద్గుణంబులను । నేర్చుకొనందగు; లోకబాంధవా॥

చ॥ ఖరముసుగంధదివ్యతరు। కాష్ఠములన్ బలుమారుమోసియున్
బరిమళమింతయున్ గనదు । భక్తివిహీనులునట్లె, నిన్ నిరం
తరమునుజూచుచున్ మదిని । దల్పరొకింతయు, నందుఁ జేసినీ
శరణముఁబొందలేరతుల। సౌఖ్యముఁ జెందరు;లోకబాంధవా॥

చ॥ నెరసులనెన్నఁబోరెచట । నేనిబుధేంద్రులు, మూఢబుద్ధులే
యరయుదురెల్లదోషములు, । హంసలుమౌక్తికరాశిఁ జేరగా
కరటసమూహముల్ చెడుగు । గల్గునెడన్ జనుః నై జలక్షణా
చరణముమానలేరనుట । సత్యముధాత్రిని;లోకబాంధవా॥

చ॥ వినయవివేకశాలికడ । విద్యయు, దాతకడన్ ధనంబు, మే
లొనరుచునెల్లవారలకు, । నొయ్యనకీర్తినివిల్చుఁ, గానియా
వినయములేనివిద్యయును। పీతవదాన్యునియింటిభాగ్యమున్
గనుఁగొనమేకకంఠమునఁ । గల్గుచనుల్ గద.లోకబాంధవా॥

చ॥ ఒరులకుహానిసేయకయ । యుండఁగఁజాలరు క్రూరచిత్తులౌ
నరులిల, వారికెల్లరకు । నైజగుణంబది, ద్రోణకీటకం
బరయఁగ నేమిలాభమని । యందినవారల నెల్లఁగుట్టితాఁ
జెఱఁజెఱమారుమూలలకుఁ । జేరఁగఁజూచును; లోకబాంధవా॥

చ॥ అరయఁగ నెల్లవారలకు । నాపదఁగూర్చుచుజీవనంబులన్
జరపెడివారుతాళుకురె । సజ్జనునాగ్రహదృష్టివృష్టికిన్?
ధరఁబసిదింపియిట్టునటుఁ । దానును కానిభయంకరాకృతిన్
కిఁదరిజేరినిల్చినను । గిట్టదెతద్ధృతి; లోకబాంధవా॥

చ॥ అలసులునీచలాభముల । కాశవహించుచునుండ్రు, కాని ధీ
రులుకఘనగౌరవంబునకు । లోచితలాభముఁగాంచఁజూతురు
జ్వలనుతికుంభికుంభమును । వాసిగఁగేసరికోరుఁగాని, తా
నలసునకమ్ముభాతినొక । యస్థినిగోరునె; లోకబాంధవా॥

ఉ॥ తిట్టితినొక్కచోటనిను । తీవ్రపదంబుల, వేఱుచోటునన్
పట్టితినీపదాబ్జముల । భక్తిసెలంగగ నేడఁజూడ ని
క్కట్టుల నైపఁ జాలకయె । గానిమరొక్కటిగాదు వేగనా
రట్టుదొలంచి సౌఖ్యమిడి । లాలనఁజేయుము; లోకబాంధవా॥

ఉ॥ భూరిదయాప్రపూర్ణ,గుణ । భూషణ,నిర్మలభక్తమానసాం
భోరుహవాస,మానిజన । పోషణ, దుర్జనసంఘ శోషణా
మారద వెంకయాఖ్యకవి । మానిత, మామకపద్యభూషితా
వేరివిమర్దనా,కలుష । భంజన,మోక్షద; లోకబాంధవా॥

చ॥ అరయకవిత్వలక్షణము । లంచితరీతిఁ బఠింపలేదు, నీ
చరణకటాక్షలబ్ధమగు । శక్తిని నేర్చినయట్లు వ్రాసితిన్
వరపనృసింహనాముఁడను । భక్తిని నిన్ను నయంబుఁ గొల్తు నా
దరమున నన్నుఁ జూచితగు। ధైర్యమొసంగుము లోకబాంధవా॥

ఉ॥ అంకవిహీనమై చెలఁగు । నాంధ్రధరామరజాతి మేమునన్
గుంకుమఁ బొట్టనంగఁదగు । కొక్కులిగడ్డసువంశమందు, శ్రీ
వేంకటజోగయార్యగుణ । వేశ్మునకున్, సతిసుబ్బమాంబకే
నంకుని సత్కృపన్ జనన । మందితి, ధాత్రిని; లోకబాంధవా॥

చ॥ దయఁగలవాఁడు నాపయిని, । తద్దయు రాఘవుఁ గొల్చు సద్గుణా
లయుఁడు, ప్రశాంతమూర్తి, విమ। లాత్ముఁడు నౌ జనకుంచి సీతరా
మయ నిల మద్గురుండుగను । మన్ననఁ జేసెద సత్కవీంద్రనా
నయగుణు నేతలంచెదన । నారతమున్ మది; లోకబాంధవా॥

ఉ॥ పాయని కూర్మి నాకు సఖు। పాయము లెప్పుడుఁ దెల్పుచున్ ననున్
బాయక నాప్తమిత్త్రునిగ । భావనఁ జేయు ద్విభాషి సత్యనా
రాయణమూర్తి, యీశతక। రాజముఁ గూర్పఁగ సాయమాటచే
నాయువు, కీర్తి, సౌఖ్యమిడి। యాతనిఁ దన్పుము; లోకబాంధవా॥

ఉ॥ ధీమహితద్విభాషికుల । దీపుడు వేంకటరామసూరి తా
నీమహిరాజ్యలక్ష్మియను । నీరజలోచనయందుఁ గాంచె దుః
ఖామయవారణప్రవణు। నార్యుని మత్ప్రియమిత్త్రుఁ బుత్త్రుఁగా
నామృడుకుమారుఁగని। నట్టులఁ గూర్మిని; లోకబాంధవా॥

చ॥ దురితవిదారమంగళము । దోర్మదపూరితదుర్జనావళీ
హరణకళాఢ్యమంగళము । హాటకసన్నిభతేజయుక్తయో
పరమపవిత్రమంగళము । భక్తజనావనసూరిపూజ్యస
చ్చరణసరోజమంగళము । సజ్జనకల్పక; లోకబాంధవా॥

సంపూర్ణము.



శ్రీబలరామకృష్ణ ముద్రాక్షరశాల, అనకాపల్లి.